Reg. No. 757.

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరు.

సంపుటము 16 { 1924 సం॥ ఏప్రియల్. } సంచిక 1

విషయములు:





చందానిర్ణయము సంవత్సరమునకు.

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 ... |
| పోషకులకు | రు 10 0 0 | చందాదారులకు | 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur, and published at Guntur, by the Editor Ashtavadhani [illegible] Janapati Pattabhirama Sastry.

# ఈసంవత్సరము చందా దయచేసిన పోషకులు

౧ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యా గారు, నూజెండ్లూరు.
౨ ఎనమండ్ర లక్ష్మీనరసింహము గారు, మర్చెంటు, బెజవాడ.
౩ రాజా వెంకటాద్య్రప్పారావు, బహద్దరు గారు, వుయ్యూరు ఎస్టేటు.

## సహాయులు.

౧ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రి గారు, చెన్నపట్టణము.
౨ పెద్దిభట్ల వీరయ్య గారు, ప్లీడరు, బెజవాడ.
౩ కాసుమాను హనుమయ్య గారు, నర్సారావుపేట.

## ప్రధాన పోషకులు.

౧ రాజా బెల్లపురవల వెంకటరామనేంద్రరావు బహద్దరు జాగీరుదారు గారు, నవాబుపేట.
౨ రామసింగు గారు, నెల్లుట్ల నగ్గరా సంస్థానముల మానేజరు నెల్లుట్ల.
౩ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు.
౪ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు
౫ బాకరాజు పరాంకుశరావు దేశముఖు గారు, యాదవర్రము

## పోషకులు.

౧ శ్రీరామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురం
౨ తంగెడ నరసింహారావు గారు, కరణం, మోర్జంపాడు.
౩ చారబుడ్డి రత్నారెడ్డి పటేలు గారు, న్యాలపోగుల.
౪ లింగాల వెంకటరెడ్డి దేశముఖు గారు, కుందవరము.
౫ నెల్లుట్ల నరసింహారావు గారు, జొనగాం.
౬ యార్లగడ్డ రంగనాయకులు నాయుడు గారు, కారంచేడు.
౭ జాగర్లమూడి కుప్పుస్వామి నాయుడు గారు, కారంచేడు.
౮ అల్లాడి లక్ష్మణరావు గారు కరణం, జంగపల్లి.
౯ రంగాచార్యులు గారు, ముక్త్యారు, దేశముఖు, మసీదుపల్లె.
౧౦ శీతలసింగు గారు, మర్చెంటు, నాగవరము.
౧౧ చేకులపల్లి కృష్ణారెడ్డి గారు, కేశవాపురము.
౧౨ సింగిరము అమృతరావు గారు, ముక్తేదారు, కొన్నె
౧౩ " లక్ష్మణసింహు గారు, జొనగాం.
౧౪ [illegible] శాస్త్రి వెంకటరత్నము గారు, వకీలు, గుంటూరు.
౧౫ వడింపల్లి నరసింహారావు గారు, జిల్లా రిజిష్ట్రారాఫీసు, గుంటూరు.

## సహాయులు.

౧ చట్వారి నారాయణరావు గారు, క్షీరసాగరము.
౨ నెల్లుట్ల నరసింహారావు గారు, చినమడూరు.
౩ నెల్లుట్ల కేశవరావు దేశముఖు గారు, నెల్లుట్ల.
౪ రంగరాజు గోపాలకిషన్ రావు దేశముఖు గారు, సాపురం
౫ నారాయణరావు గారు, దాతారుపల్లె.

# అభినవసరస్వతి

సంపుటము ౧౬ { జానపాడు<br>రక్తాక్షి సం॥ చైత్రమాసము. } సంచిక ౧

## స్వవిషయము.

ఆర్యులారా!

ఈయభినవసరస్వతికి ౧౫ వత్సరములనయస్సు నిండి యీమాసముతో ౧౬వ వత్సర మారంభమైనది. అనేకకష్టముల కాలవాలమగుచున్నను సహించుకొని యీపత్రికను విడువక నడపుటయే ప్రధానకార్యముగాఁబెట్టుకొని యత్నించితి. కాలవ్యత్యాసమైనను నింతవఱకు సరిగా నడపుకొనివచ్చితి. నవనాగరికులకును నాస్తికులకును నిందలివిషయములు మనసున కెక్కకున్నను సనాతనధర్మాభిమానులకును భాషాభిమానులకును మనోరంజకంబు లగుచునేయున్నవి. అందువలననే యిప్పటికి ౯గురు ప్రధానపోషకులును ౧౭గురుపోషకులును ౨౨మంది సహాయులును ౨౦౦లమంది చందాదారులును గలిగి దినదినప్రవర్ధమాన మగుచున్నది. ఇదియునుంగాక ప్రకృత మింకను ధర్మబోధ యవసరమైయున్నదని శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరిపీఠాధిపతులును శ్రీ మల్లాది రామకృష్ణచయనులుగారువున్నగు విద్వాంసులును మఱికొందఱు పెద్దమనుష్యులును యత్నించుచున్నవారు. అందులకు మఱియొకపత్రికయే సాగింపవలెనని కొందఱును నీయభినవసరస్వతినే పక్షపత్రికగా మార్చి తగుసాహాయ్యప్రోత్సాహము లిచ్చినఁజాలునని కొందఱును భిన్నాభిప్రాయులైయున్నవారు. అందు సర్వవిధముల భారవాహకులును నధ్యక్షులును శ్రీ పుష్పగిరిపీఠాధిపతులే కావున వారిపత్రికకే తగి

నంతప్రోత్సాహమిచ్చి పక్షపత్రికగా మార్పించు సూచనలు కానవచ్చుచున్నవి. మల్లాది రామకృష్ణచయనులుగారు మున్నగువారు వ్యాసలేఖకులుగా నుండ నూఱువిధములఁ గొలఁదికాలములోనే యియ్యది పక్షపత్రికగూడఁ గావచ్చును. ఒకవేళ నియ్యది వారిదృష్టి కాఁగక ప్రత్యేక పత్రికాస్థాపనమే చేసినను యథాపూర్వంబుగ నాకష్టమంతయు దీనికే ధారవోయుచు సకలవిధముల నింకింత మెఱుఁగువెట్టియే ప్రచురించుచుందునుగాన ధర్మజిజ్ఞాసువులందఱును నీపత్రికకుఁ దగినంతప్రోత్సాహ మొసంగుటకు సంప్రార్థితులు.

చిరకాలమునుండియు నభినవసరస్వతిని ముద్రించి యిచ్చుచున్న చంద్రికాప్రెస్సు కొన్నికారణములచే నీనడుమ కార్శ్యమునొందుటయు బెజవాడ శారదాభాండారప్రెస్సునకేగి యచ్చట ప్రూఫురీడరులు సరియైనవారు లేమి నేనేయేగి పదియయిదుదినములు పడియుండియు లేక తప్పులకోర్చుకొని ప్రెస్సువారిమీఁదనే భారమునైచియుఁ దొమ్మిది నెలలనుండి శ్రమములు పడుచుంటిని. ప్రస్తుతము మరలఁ జంద్రికాప్రెస్సు రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహదరు జమీందారుగారి యాస్థానోద్యోగులలో నొకరగు గాముని భీమశంకరముగారి పరిపాలనక్రిందికి వచ్చుటచేతను నందు ప్రూఫురీడరు సంస్కృతాంధ్రహూణయవనహిందీభాషాపండితులును విద్వత్కవులును నగు చతుర్వేదులఅమరయ్యశాస్త్రిగారగుటచేతను మరలఁ జంద్రికాప్రెస్సులోనే ముద్రింపించుచున్నాఁడను- ఈయీవ్యవస్థలు సరిగాఁ జేసికొనుటలోను గ్రొత్తసంవత్సరమగుటను నైన యించుక కాలాతిక్రమణకుఁ జదువరు లోర్చుకొని యథాపూర్వమైన యభిమానముతో నీపత్రికస్వీకరించుటకుఁ బ్రార్థితులు

— • పుష్పగిరిపీఠాధిపతుల బాపట్లతాలూకాసంచారము • —

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యాద్యనేకబిరుదావళీ విరాజితులును జగద్గురుపుష్పగిరి పీఠాధిపతులును నగు శ్రీమదభినవో

ద్దండవిద్యానరసింహభారతీస్వాములవారు బాపట్లతాలూకా సంచారము
సేయుచుండుటయు శ్రీకల్యాణానందభారతీస్వాములవారు గుంటూరుపు
రం బలంకరించుచుఁ బుష్పగిరి విరూపాక్ష శృంగగిర్యాది పీఠముల
కన్నింటికంటెఁ దమపీఠ ముత్కృష్టమైనదనియు నింతటినుండి భారత
మహాజనులందఱు నాచారవ్యవహారములపట్లఁ దమయాజ్ఞాప్రకార మే
వర్తింపవలసినదనియు సామ్రాజ్యపట్టాభిషేకమహోత్సవప్రకాశిక
యనుపేరఁ బత్రిక లచ్చొత్తించి ప్రచురించి యూరూరికిఁ బంపుచుండు
టయు నందుపై లోకులు కలవరమంది కొన్ని సభలుచేసికొని పుష్పగిరి
పీఠాధిపతులే తమ దేశగురువులని నిర్ణయించుకొనుచుండుటయు రుధిరో
ద్గారి ఫాల్గునమాసపత్రికయందుఁ దెలిపియున్నవారము. శ్రుతిధర్మసం
జీవినీపత్రికలోఁ బ్రచురింపఁబడిన తత్పీఠ సంగ్రహచరిత్రకుఁ బ్రత్యుత్తర
ముగా సత్యచరిత్రము వ్రాయుదుమనియుఁ దెలిపియుంటిమి. తచ్చరిత్ర లేఖ
నమునకు మఱియొక సంచిక కవకాశమిచ్చి యీసంచికయందే యింకొక
చోటఁ జెరుకూరు విద్వద్బ్రాహ్మణసభవారు శ్రీకల్యాణానందభారతీస్వా
ములవారికిచ్చిన ప్రత్యుత్తరమును మాత్రము ప్రకటించుచు వేఱొక స్వా
ములవారి యుదంత మెత్తుకొనుచున్నవారము. రుధిరోద్గారిసం॥ ఫాల్గున
బహుళ చతుర్థీదినంబున శ్రీ పుష్పగిరిస్వాములవారు మఱ్ఱిపూడిగ్రామ
స్థులచే సంప్రార్థితులై యచ్చటికి విచ్చేసి వారముదినము లయ్యూర
నివసించిరి-తద్గ్రామస్థులు సహజముగనే పరమభక్తులును సంతతసత్కా
ర్యకరణబద్ధకంకణులును నై యున్నకతంబునఁ బ్రత్యహము భిక్షలుఁ బా
దపూజలు గజోత్సవములు మహావైభవముతో జరుపఁబడెను.

అట్టిపుణ్యస్థలమగుటవలననే శ్రీవారుదయచేయ నక్కాలమున
కచ్చటికి శ్రీ రామచంద్రేంద్రసరస్వతీస్వాములవారు (అప్పావధానులు
గారు) శ్రీ సచ్చిదానందేంద్రసరస్వతీస్వాములవారు (మల్లాది హనుమ
చ్ఛాస్త్రిగారు) బోధానందేంద్ర సరస్వతీస్వాములవారు (ఎనమండ్ర

లక్ష్మీనారాయణగారు) మున్నగు యతిపంచకమును మల్లాది రామకృష్ణ విద్వచ్ఛయనులుగారు మొదలగు విద్వాంసులును జనుదెంచిరి. పీఠాధిపతుల సాన్నిధ్యమున నన్వహము నేదోయొక ధర్మోపన్యాసము చేయఁబడుచుండుట మర్యాద। కావున నొకదినము శ్రీరామకృష్ణచయనులుగారు సభికుల ప్రార్థనపై వర్ణాశ్రమధర్మముల నుపన్యసించుచుండ నవనాగరికులుకొందఱు ఉపన్యాసమధ్యమునఁ గుతర్కములఁ జేయఁగడంగుటయు మీరడుగఁదలఁచిన ప్రశ్నలన్నియు నుపన్యాసము ముగిసిన పిదప నడుగనగునుగాని నడుమ నడుగుటకు వీలులేదని శ్రీచయనులుగారు ప్రత్యుత్తరించిరి. అంతఁ గొంతవడికి సంధ్యావందనసమయ మగుటయు శిష్టజనులెల్లరును సభనుండిలేచి కాల్యకృత్యములు నెఱవేర్చి మరల సమావేశమయిరి. అంత నన్నవనాగరికులును దద్గ్రామసమీపస్థమగు నప్పికట్లగ్రామవాసులగు కమ్మమహాజనులును దమతమ శంకలనన్నిటినేకరువు పెట్టిరి. చయనులవారు తగుసమాధానములనే చెప్పిరి కాని యవి పృచ్ఛకులకుఁ దృప్తికరములు కాకపోయెను. అయినను బ్రాహ్మణులు నిరుత్తరులయియేకూర్చుండిరి కాని కమ్మవారు మాశంకలకు సరియైనసమాధానములు రాలేదని లేచి చెప్పుచు "జియస్‌బి సరస్వతికిజే" యని కేకలు వేయుచు వెడలిపోయిరి. సభాస్తారుల కందఱకును వారు జియస్ బి సరస్వతికి శిష్యులని యప్పుడు తెలియ నయ్యెను. ఈ జి యస్ బి సరస్వతిగారి చరిత్రమును గొంతకాలముక్రింద నీపత్రిక ప్రచురించియే యున్నదికాని మరల నొకమాఱు తెలిసినవారికిని దెలియనివారికిని విన్నవింతుము

## —♦ జి. యస్. బి. సరస్వతి ♦—

ఈజియస్‌బిసరస్వతి జన్మస్థానము వంగవోలుతాలూకా నిడమానూరు నియోగిబ్రాహ్మణుఁడు. యింటిపేరు చదలవాడవారు. పేరు రామకృష్ణయ్య. ఈయన చిన్నతనముననే తలిదండ్రులం గోలుపోయి కడపలో

నుండిన మేనమామలయింటికిఁ జేరి తత్పోష్యమాణుఁడగుచు ఫోర్త్ ఫారమువఱకో పిఫ్తుఫారమువఱకో యింగ్లీషుచదివెను. అట్టి విద్యార్థి దశలోనే సరస్వతిగారికి మేనమామభార్యతో సఖ్యముకుదురుటయు నయ్యది యెఱింగి యమ్మాతులుఁ డీయనను దనయింటినుండి నిష్కాసితుఁ జేసెను. అట్లునిష్కాసితుఁడయ్యుఁదదంగనను రహస్థలంబునఁ గలసికొనుచుండుటయు మేనమామ లీయనపైఁ జౌర్యమొకటి యారోపించిరి. వారంటుచేయించిరి. కర్నూలుకో యెక్కడకో పాఱిపోయి రామానంద స్వామియను నొకయతివద్ద సన్యసించెను. తత్కారణముచే నవ్వారంటు రద్దుపడిపోవుటయుఁ గ్రమముగా నాచదువుకొన్న యింగ్లీషుముక్కల కనుగుణముగా నార్యసామాజికులగు దయానందాదుల వ్రాఁతలను దోడుచేసికొని తిరుగుచు నెల్లూరునకు సమీపమందుండు నిందుకూరు పేటయను నొకయూరఁ జేరి గాడేపల్లివారను నొక బ్రాహ్మణకుటుంబికులయింటఁ బ్రవేశించి యక్కడఁగూడ నొక్క చక్కనక్కను బ్రక్కకుఁ జేర్చుకొని తత్సహోదరులగు శేషయ్య రంగయ్యలనువారి వెంటవేసికొని యచ్చటచ్చటందిరిగి ధనమార్జించుచుఁ దత్కుటుంబమును బోషింపఁగలిగెను. అట్టిపట్ల నుమామహేశ్వరపుర వెంకటాపురాగ్రహారికులగు కొందఱు వైదికబ్రాహ్మణులు కృత్రిమపీఠముల బయలుదేరఁదీసి సంచరించుచు ధనార్జనముసేయఁగడంగిరి. అందుల కవ్వారికి సన్యాసులు కావలసివచ్చుటయు నొకచో నీసన్యాసి తటస్థింప నీయననుదీసికొని సంచారమున కుపక్రమించిరి.

అట్లుపక్రమించి తత్తద్దేశంబులం ద్రిప్పుటలోఁ గామపరతంత్రుఁడై శరీరము చెడఁగొట్టుకొనుటయు నింతలో నగ్రహారికుల ధనతృష్ణగూడఁ గొంత యుపశమింప వారియిండ్లకు వారును నిజాంరాష్ట్రమునకు సన్యాసియును జేరఁగలిగిరి. ఇదియంతయు నీయనను వెంటవేసికొని దేశదేశముఁ ద్రిప్పిన యగ్రహారబ్రాహ్మణులవలననుండి విన్నసంగతి.

వారితోఁ గలసితిరిగెడికాలమున స్వచరిత్రమంతయు సీజియస్‌బిసరస్వతి యిట్లు చెప్పుకొనియెను. అటుతరువాత నిజామురాజ్యమున నీయన నడపిన వృత్తమంతయు రికార్డుమూలముననే తెలియనయ్యెడిని. నిజాము దేశములోని కరీమునగరముజిల్లాయందలి చొప్పదండియను గ్రామమునఁ బ్రవేశించి రాయంకొలను గ్రామవాస్తవ్యుఁడగు తాడిచెర్ల రాజేశ్వరరావుగారి భార్యయుఁ జొప్పదండిగ్రామనివాసియగు కూర్మయ్య పంతులు మేనగోడలును నిరువది యెనిమిదియేండ్ల ప్రాయముగలదియు నైన లచ్చమ్మయనునామె మేనమామలదగ్గరఁ జొప్పదండికిఁబోయి యున్నతటి నామెకుఁగల గ్రహబాధను దన మంత్రబలముచేఁ బోఁగొట్టెదనని యీజియస్‌బిసరస్వతి కొన్నిదినములు భూతచికిత్స నెఱపి తుదకాబిడ కాంతరంగికుఁడగుటయుఁ దద్బంధువు లాయమ నతికష్టముపై నత్తవారియింటికి కనిచిరి. అంత నీసరస్వతిగారు కరీమునగరము నదాలతు కోర్టులో నీక్రిందివిధముగాఁ బ్లైంటు దాఖల్ చేసెను.

నెం 44/1326

జి యస్ బి సరస్వతి. తండ్రి. రామానందసరస్వతి. బ్రాహ్మణుఁడు.

ఉపన్యాసకవృత్తి ... వాది.

| | | |
|---|---|---|
| ౧ తాడిచెర్ల రాజేశ్వరరావు ... | } | ప్రతివాదులు. |
| ౨ లచ్చమ్మ | | |

(౧) వాది కరీమునగరములో ... న్యాయశాస్త్రమునననుసరించి రెండవప్రతివాదిని వివాహము చేసికొనియున్నాఁడు.

(౨) రెండవప్రతివాది యనారోగ్యమువలనఁ జొప్పదండి యనుగ్రామములోఁ దన మేనమామలగు వెంకయ్య మొదలగువారి యింటిలోనుండుచుండఁగా వాదికూడ నక్కడనే యుండుచుండెను.

(3) ౪ అమర్దాద్ ౧౩౨౪ వ ఫసలీని ౨వ ప్రతివాదిని ౧ వ ప్రతివాది యామె మేనమామల యింటినుంచి యెత్తుకొనిపోయి తనయింటిలో నుంచుకొన్నాఁడు.

(౪) ౨ వ ప్రతివాది వాదివద్దకు రాలేదు. ౧ వ ప్రతివాది రానీయఁడు

వాదిభార్యను వాదికిప్పించి దావాఖర్చులు ప్రతివాదులపై వేయించుటకు వాది ప్రార్థించుచున్నాఁడు. ౧ వ ప్రతివాదికిని ౨ వ ప్రతివాదికిని నేవిధమైనసంబంధమును లేదు నిష్కారణముగా వాదియను మతిలేకుండ బలాత్కారముగాఁదీసికొని పోయియున్నాఁడు.

రెండవ ప్రతివాది జవాబునకు జబాబు

లచ్చమ్మకు రాజేశ్వరరావు పెనిమిటికాఁడు. ధర్మశాస్త్రప్రకారము వారలవివాహము చెల్లనేరదు. అందువల్ల నామెపై నతని కేవిధమైనయధికారమును లేదు. ధర్మశాస్త్రరీతి నతనిసంబంధము తొలఁగి పోయినది. వాదికిని నాకును ధర్మశాస్త్రము (దేవరన్యాయము) ననుసరించి వివాహముగుటవలన నాతనియాజ్ఞ యనవరసమయియున్నది. గొప్పబ్రాహ్మణకులమందుఁగూడ ధర్మశాస్త్రప్రకారము వివాహము రద్దుకావచ్చును. ఆచారమును గలదు. లచ్చమ్మను జి యస్ బి సరస్వతి వివాహమాడినయంశము. నిశ్చయము. ధర్మశాస్త్రప్రకారమిట్టివివాహము జరుగవచ్చును. లచ్చమ్మ రాజేశ్వరరావువద్దనుండి తొలఁగవచ్చును. రాజేశ్వరరావును గష్టపెట్టవలెననికాని యతని మానభంగమునకుఁగాని వాది దావాచేసియుండ లేదు. దావాసంగతులు వాస్తవములైనందు వలన రాజేశ్వరరావుకుమానభంగ మేమియుఁ గలుగజాలదు.

తీర్పు

౩౦ వ షహరేవరు ౧౩౨౭ ఫసలి

ఈదిన మిసిలికాగ్దు నావద్దకువచ్చెను. ప్రతివాదుల వకీలు హాజరైనాఁడు. వాదికాని వాదివకీలుకాని హాజరులేరు. కావున డిస్మిస్ చేయుటయైనది. నవాబుబీ నజీరుజెంగుబహాదరు. జెడ్జి

ఆర్యులారా! ఈదావాక్రమమంతయుం జదివితిరికదా! ఈయన

ప్రవర్తన మిట్టిదని వేఱె చెప్పక పబ్లీకురికార్డుయొక్క నకలే మీాయెదుట బెట్టఁబడియె. ఇట్టివానిభోధలు కొన్నిగ్రామములలోని కమ్మవారికి నచ్చుచున్నవి. మీాకందఱికి వేదాధికారమున్నదనియు నుపనయనముచేసికొండనియు బోధించినంతనే మనవారవ్వాక్యముల వేదవాక్యములవలె భావించి పెద్దపెద్దవారుకూడఁ బ్రకృత ముపనయనాదిసంస్కారములు జరుపుకొని వేదాధ్యయనము చేయ మొదలిడినారు. లచ్చమ్మను గాంధర్వవిధిం బెండ్లియాడి యామెభర్తపై వ్యాజ్యము వేసి యం దపజయమునుగాంచినతర్వాత నీయన ధర్మవిరుద్ధబోధలకును బ్రవర్తనకును నేవగించుకొనితత్రత్యు లనేకులు బ్రహారణములు వేయుటకు సిద్ధపడుటయుఁ గ్రమముగాఁ గాలమహిమచే బ్రాహ్మణులపై ద్వేషించియున్న కమ్మసంఘమునవచ్చి కలసికొని యీరీతి వారి నాడించుచున్న యీ జియస్ బి సరస్వతి సత్యచరిత్ర మిది. ఇంతియేకాని యీయన యొక పండితుఁడుకాఁడు. కాకున్నను దుర్వాదములు పత్రికలమూలమునఁ బ్రకటించుచు నెవ్వియో వ్రాయుచుండును. ప్రప్రథమమునఁ గూనపూలి పూర్ణయ్యశాస్త్రిగారీయనవాదములు చూచి సభలుచేసి ఖండించి నిరుత్తరుఁ జేసెను. కాని యీయనయే యపజయముపొందిన ట్లొక పత్రమే వ్రాసి దానికిఁ దిలకాష్ఠమహిషబంధనమన్నట్లు లజ్ఞానతిమిరభాస్కరమని పేరుపెట్టి యచ్చొత్తించెను. ఇది యితరునిభార్య నాభార్యయని దావాతెచ్చుటకంటె నెక్కువపని కాదు. లోకమంతయు నజ్ఞానతిమిరమున నావరింపఁబడియుండ నేఁటికీయనవచ్చి యిట్టి జ్ఞానభాస్కరును దయింపఁజేయుచుండెను.

ఈసంగతులు విని కొంతమంది యీయనవాదంబుల ఖండించియు సభాముఖంబున నిరుత్తరుఁ జేసియున్నను దనపని తానువదలక కావించుచునే యున్నవాఁడు. కూచిపూడిగ్రామమునఁ బెద్దసభల్లో శివపురపు వీరభద్రపాకయాజిగారికిని వీరికిని నడచిన వివాదముపై నాయూరికమ్మ

మహాజనులే యీయనపాండిత్యమును నీయనచేయు వాదమందుండు ధర్మసూక్ష్మమును గనిపెట్టి స్త్రీశూద్రులకు వేదాధ్యయనాధికారము లేదని తెలిసికొని సరస్వతిగారి యపజయము సర్వజనులకుం దెలియు లాగున ౯౦౦ మంది యొక్కుమ్మడి దస్కతులు చేసి యచ్చొత్తించి యాపత్రి కల దేశదేశంబులం బంచిపెట్టించియుండిరి. ఇట్లక్కడక్కడ జరుగు సభ ంబలోఁ బరాభూతుఁడగుచున్నను మానమును వదలి మరలఁ బ్రచారము సేయుచున్నవాఁడు. అప్పికట్లకమ్మవారు సభనుండి యట్లు లేచిపోయి మహారాజశ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారు మున్నగు కొందఱిఁ బ్రముఖులను జి.యస్.బి.సరస్వతిని బిలిపించుకొని సరస్వతిగారినిమాత్ర మప్పికట్లలోనే యుంచి తక్కినవారితో మఱునాడు శ్రీ పుష్పగిరి స్వాములవారిసన్నిధికిం జనుదెంచుటయుఁ దత్సభికులు చాలమంది బ్రాహ్మణులగుటచే వారిరాక కలహకారకంబగునేమోయని భయ మందిరి కాని సంస్థానమర్యాదానుసారముగా నందఱకు నాసనప్రదానా ద్యర్హగౌరవము గావించిరి.

అట్టిభయముచేతనే పీఠాధిపతులు నివసించు మందిరమునఁగాక ప్రక్కయింటిముందరనే యాస్తరణములు పఱపించి యచ్చటనే సభ కావింపఁబడియెను. ఆకూడినసభికులలోఁ బీఠాధిపతు లగ్రాసనాధిపతు లుగానుండుటకు మాఱుగా శ్రీసచ్చిదానందేంద్ర సరస్వతీస్వాములవారు తత్స్థానం బలంకరించి కూర్చుండిరి. వీరు పూర్వాశ్రమమునఁ బ్రథమము నండూరుగ్రామనివాసులై మెట్రిక్యులేషను వఱకు హూణభాష నభ్యసించి తద్విద్యార్థు లందఱును సహజముగా నవలంబించెడి విపరీతమతమునే యాశ్రయించి కొంతకాలముపాటుపడియున్న మల్లాది హనుమచ్ఛాస్త్రి గారు. బ్రహ్మసామాజికులై యట్లు కొంతకాలముండి యందుల సారము గ్రహించి మరలఁ దమకుఁ దత్పూర్వమలవడియున్న సంస్కృతభాషను వృద్ధిచేసికొని భాష్యశాంతినిగూడఁ జేసి విరక్తులై తుదకు సన్యసించి

స్వసంతరణమున కే కాక ధర్మ ప్రచారమూలమున లోకము నుద్ధరించుటకుఁ గూడఁ బాటుపడుచున్న మహామహులు. అందువలననే యనేక విద్వాంసు లాసభ నధిష్ఠించియున్నను నందును శ్రీ రామకృష్ణ చయనులుగారు న్యాయవేదాంతాదిశాస్త్రపండితులును ధర్మరహస్యవిదులును ప్రసిద్ధోపన్యాసకులును బరమతఖండనప్రవీణులును నై యున్నను వచ్చినకమ్మవారు హూణభాషావిదులగుట శ్రీ స్వాముల వారే నాఁటిసంభాషణమున కుపక్రమించిరి.

ఆసంభాషణములోఁ గమ్మవారిరాకచేఁ దమకుఁ గలిగిన యనుమానమును సూచించుటయుఁ ద్రిపురనేని రామస్వామిచౌదరిగారు లేచి మృదుమధురవచనరచనతోఁ దమ రట్టిదురభిప్రాయముతో రాలేదనియుఁ బూర్వము మేము క్షత్రియులమైయుండి యెందువలననో నిజవర్ణధర్మము లోపించిపోఁ జతుర్థులముగా వాడఁబడుచున్నట్లు మా యూహ యనియు నందులకు దేశగురువులయొద్ద నేమినిర్ధారణ చేయఁబడునో తెలిసికొందమనియే వచ్చితిమి కాని వేఱు కాదనియుఁ జాల సరసముగాఁ బ్రసంగించిరి. అందులకు శ్రీ సచ్చిదానందేంద్ర సరస్వతీస్వాములవారే యాంగ్లేయభాషాప్రసిద్ధములగు యుక్తులచేతను శాస్త్రయుక్తులచేతను సరసమైన ప్రత్యుత్తరము నిచ్చిరి. ఆప్రత్యుత్తరము రామస్వామిగారి నేమి తక్కిన కమ్మవారి నేమి తృప్తిపఱుపమిని మరలమరలఁ బ్రశ్నోత్తరములు నడచెను. ఏమినడచినను నాఁటిసభ యుట్టికలహముసకును గారకముగాక సరసముగా ముగింపఁబడియెను. దీనికంతటికిని శ్రీ రామస్వామిచౌదరిగారి సత్స్వభావమే కారణము. వీరు క్షత్రియంమన్యమానులైనను బ్రాహ్మణులు తమ్ము నేమో మొదటినుండి చెడఁగొట్టిరను ప్రమాదమునఁ బడియున్నను లాయరులును శతావధానులును నై యున్నకతంబున రసికతయు సౌజన్యమును వదలియుండలేదు. అట్టివార లాకమ్మసంఘమున కగ్రేసరులై యుండుటచే శ్రీస్వాములవారిసూక్తులు కమ్మవా

రిని బోయెడిపోకనుండి మరలింపఁజాలకున్నను దత్కాలమునకు సరసముగా నవలకుఁ బంపఁగలిగెను. అట్లు సరసముగా సభనుండి వెడలిపోయి రామస్వామిచౌదరిగారు మఱునాఁడు గ్రామాంతరమున కేగిరి కాని యప్పికట్లకమ్మవారు జి. యస్. బి. సరస్వతిని దోడ్కొని మరల మఱునాఁడు శ్రీపుష్పగిరిపీఠాధిపతుల సన్నిధికి నరుదెంచిరి. సరస్వతిగారు పీఠాధిపతులున్న మందిరద్వారమును దెఱచుకొని లోపలికిఁబోనుద్యుక్తులగుటయు ద్వారికు లడ్డగించిరి. అటుపై నవ్వాకిటఁగూర్చుండియుండ సన్నిధిమంత్రులు పూర్వస్థలముననే చాపలు పఱపించి యచ్చటికాహ్వానము చేసిరి. అందఱును గూర్చుండిరి. వారిని వీరుగాని వీరిని వారుగాని మాటలాడించుకొనలేదు. అట్లు కొంతవడి కూర్చుండి యమాత్యులు కార్యాంతరముంగూర్చి లేచిపోయిరి. అంతమహాజనములో శ్రీసరస్వతిగారికి యతియని వందనముఁజేసినవా రొక్కరును గానరారు. పూర్వోక్తవిధమున నింత గర్హ్యమైనచరిత్రగల యతిబ్రువున కెవ్వరు వందనముచేయుదురు? అట్లు వచ్చినవారు వచ్చినట్లు మిన్నక కూర్చుండుటయుఁ గొందఱు సచ్చిదానందేంద్ర సరస్వతీ స్వాములవారును రామకృష్ణచయనులుగారును దక్కఁగలపండితులును గూర్చుండియున్న మఱియొకని కేతనమున కేగి జి. యస్. బి. సరస్వతి వచ్చి యచ్చటఁగూర్చుండెను. మీరును వచ్చి సంభాషించుఁడని పిలిచిరి,

అందులకు శ్రీసచ్చిదానందేంద్రసరస్వతి స్వాములవారు మనము సభకూడియున్నప్పుడు మనయొద్దకువచ్చికాని, లేక యిచ్చటికివచ్చికాని మేము మీతో నీవిషయమున వివదింపవచ్చితిమి లేక తెలిసికొనవచ్చితిమని పిలిచినఁదప్ప వారువచ్చికూర్చున్నచోటి కరుగవలసిన యవసరమేమియున్నదని యయ్యసమసమావేశమున కియ్యకొనరైరి. అందుపైఁ గొందఱు మాతో సమాధానము చెప్పఁజాలక మత్సమక్షమునకు రాకపోయిరని ప్రకటింతురుకావునఁ దప్ప కచ్చటికివచ్చి యాయనను

గదలించి వాగ్బంధముచేసి పంపవలసినదని నిర్బంధించిరికాని యట్లు చెప్పుకొనుటకేమి, యిదివఱ కెన్నిమోసభలలో విజితుఁడై మరల నెవ్విరియో యసత్యములఁ బ్రకటించుచున్నదాని కేమిచేయుచున్నామని యు నియమబద్ధుఁడుకాక యిష్టమువచ్చినట్లు మాటలాడువానితో నేమి ప్రసంగింపవలెననియుఁ దత్సవగా వేశమునకు శ్రీసచ్చిదానందేంద్ర సరస్వతీ స్వాములవారు పూర్తిగా నిష్టపడకపోయిరి. అంతకుఁబూర్వ మనంతవరములో నొకపరి జి. యస్. బి. సరస్వతివద్ద కీస్వాములవారు తమంతటఁదామే యేగి వందనముఁగూడఁ జేసి మాటలాడిరఁట కాని యున్మత్తప్రలాపము లయ్యెనఁట. ఒకగ్రంథముననే యొకవాక్యము ప్రమాణముః మఱియొకవాక్య మప్రమాణము నని వాదించెనఁట.

భాగవతము నెవరో గంజాయి త్రావి వ్రాసిరని యనెనఁట. ఇట్టి యసంబద్ధప్రలాపితో నేమిమాటలాడవలెనని వారియభిప్రాయము. అట్లు లచ్చట వారును నిచ్చటవీరును గూర్చుండియుండఁ దద్గ్రామస్థులు కొందఱు సరస్వతిగారివద్ద కేగి మీ రెందుకువచ్చితిరని ప్రశ్నించుటయుఁ బుష్పగిపీఠాధిపతుల సన్నిధిని బ్రత్యహము నెవ్వరియో ధర్మోపన్యాసములు జరుగుచున్నవని వినవచ్చితిరనిరి. అందుపై నాప్రచ్ఛకులుపన్యాసములు కేలైననాఁడు చెప్పుదురేకాని నియతములుకావు కావున నీదినము పండితు లన్యత్ర యేమో మాటలాడుకొనుచు విరమించిరని వచించుటయు నట్లైన మేము వెళ్లిపోయెదమని సరస్వతిగారును దదనుయాయులగు కమ్మసహజనులును నప్పికట్లకుం బోయిరి. ఈసన్యాసి పండితులున్న చోటికిరానేరాఁడు. కమ్మవారిబలాత్కారముచే నెట్లో వచ్చెను. అట్టి వాని శృంగభంగముచేసిపంపక యింతమంది పండితు లుండియు విడిచిపుచ్చు టెది యేమిప్రమాదమని కొందఱును నిట్టివానితోఁ బండితులు వివాదమునకుఁ దలపడిన రసాభాసముగుఁ గావున నిట్లుచేయుట యేమంచిదని మఱికొందఱును నిట్లు పరిపరి

విధంబుల ననుకొనఁదొడంగిరి. అందుల కనుగుణముగనే సరస్వతిగారు మట్టిపూడి యవలకు వెళ్లినతోడనే కమ్మవారితో "నేను జెప్పలేదా, నేను వచ్చినచోఁ బండితులు పాఱిపోక యెటులుండు"రని ప్రగల్భములు కొట్టుట కొందఱు వినివచ్చిరి.

అట్లుపోయి మఱునాఁ డప్పికట్లలో సభలుచేసి యేమేమో చెప్పుకొనుటయే కాక కమ్మవారు క్షత్రియులనియు వారి కుపనయన వేదాధికార మున్నదనియు నేను జెప్పుచున్నవిషయమును గాదని ధ్రువపఱుపఁగలవా రెవ్వరేని యుండిన వారికి వేయినూటపదియూరు రూపాయలు బహుమతిచేసి నేను పుష్పగిరి పీఠాధిపతులమ్రోల నగారా కొట్టి సాయబులలోఁ గలిసిపోదునని యొకపత్రిక వ్రాసి శ్రీ పుష్పగిరి స్వాములవారి సన్నిధికి బంపించెను. ఈమధ్యప్రాయి ప్రసంగములతో నేమిగాని యూరకుండి యాపీఠాధిపతులు కమ్మవారు క్షత్రియులనియు నుపనయన వేదాధికారము లున్ననవియు మీరు చెప్పుచున్నట్లు తెలియ వచ్చుచున్నదికావున మాసన్నిధికివచ్చినచోఁ బండితసభచేసి యందుఁ దద్విషయము చర్చింపఁబడునని యప్పికట్లకమ్మవారికి మాత్రము శ్రీముఖముఁ బంపిరి. అది పుచ్చుకొనుటకే కొంతసంశయించి తుదకు పుచ్చుకొని కొందఱు పీఠాధిపతులసన్నిధి కరుదెంచి మాలోఁ బ్రముఖులైనవారందఱును నేఁడు లేరుకావున వారిని బిలిపించుకొని రేపువత్తమని మనవిచేసిరి. రేపురాకున్న మే మీయూరువిడిచి యవలకేగదము, పండితులును గొందఱు చనుదురు, పండితులందఱు నుండఁగనే వచ్చుట మంచిదని సన్నిధినుండి సెలవయ్యెను.

ఆమరునాఁడు పీఠాధిపతుల సన్నిధిని బండితసభ చేరుసమయమునకు మరల నప్పికట్ల కమ్మవారు చనుదెంచి పూర్వపుసంగతి నటుంచి యొక విజ్ఞాపనపత్రము నర్పించిరి. పుష్పగిరిపీఠాధిపతులు సర్వవర్ణస్మార్తబృందమునకును గురువులగుటవలన నప్పికట్లకమ్మవారికివ్రాయు

శ్రీముఖములో నస్మదత్యంతప్రియశిష్యులైన యను విశేషణమును జేర్చియుండిరి. దానికిజవాబుగాఁ గమ్మవారు వ్రాసికొన్న విజ్ఞాపనములో యుష్మదత్యంతప్రియముఖ్యులైన యను విశేషణమునే తమకు వేసికొనిరి గాని శిష్యులైనయని వ్రాయరైరి. విజ్ఞాపనలోనున్న విశేషమేమనఁగా, జి. యస్. బి. సరస్వతిగారు జయార్థప్రకాశికయని యొక గ్రంథమచ్చొత్తించియుండిరి. అందుఁ బ్రచ్ఛన్నరాజకులనిర్ణయమని యొక భాగము. అద్దాని విమర్శింపవలసినదనియు నుండీగ్రంథము దీసికొన్నట్లు రసీదు నీవలసినదనియు నందలిసారాంశము. శ్రీస్వాములవారి మంత్రివర్గము వారు తద్విజ్ఞాపనపత్రముం బరిశీలించి యందు యుష్మదత్యంతప్రియముఖ్యులైనయని యున్నది కాని శిష్యులని లేదు కావున శిష్యులు కానివారి ధర్మసందేహములఁ దీర్చు పని మాది కాదని నోటిమాటలతోనే జవాబు చెప్పి మరల నప్పత్రము వారికేయిచ్చి వేసిరి. అంత శిష్యులని దిద్దుకొనివచ్చిరఁట కాని తత్సమయమున నుపన్యాసము జరుగుచుండుటచే మంత్రివర్గము వారయ్యది మరలగ్రహించు నవకాశము లేకపోయెను.

అంత మఱునాఁడు పీఠాధిపతులు పూండ్లయనుగ్రామమునకును రామకృష్ణచయనులుగారు మొదలగు మేము మాయిండ్లకును వెళ్లిపోవుట తటస్థించెను. ప్రస్తుతము కలిపురుషుఁడు జి. యస్. బి. సరస్వతి రూపమున నీరీతి నాట్యమాడుచున్నాఁడు. ఈవిషయమున వర్ణాత్కృష్ట్యము సంపాదింతమన్న దుర్భ్రమ యొకటితప్పఁ గమ్మవారితప్పు మఱి యేమియు లేదు. ఉన్నతప్పంతయు జి. యస్. బి. సరస్వతివద్దనే యున్నది. తప్పునకుఁదగినశిక్ష దండధరుఁడు చేయకమానఁడు. జరిగినవృత్తమంతయు నిట్లుండఁ బలువురు పలువిధములఁ జెప్పుకొనుచున్నారు. నిజము నిలుకడమీఁదఁ దెలియకమానదు. ప్రముఖులును బుద్ధిమంతులును నగు పలువురాదికమ్మవారు యథాపూర్వముగ నే బ్రాహ్మణులయెడలభక్తి విశ్వాసములు గలిగి వర్తించుచునే యున్నారు. ఎవరో కొంతమంది

యుపకు లీ భ్రమమునఁజిక్కి జి.యస్.బి. సరస్వతిని జుట్టుకొని తిరుగుచు న్నవారు తిరుగుదురుగాక. క్రమముగా వారే మార్గమునకు రాఁగలరు. కాన తగుబోధలు చేయవలసినదే కాని వారిని మనము నిందింపవలసినపని లేదు. ధర్మవ్యవస్థ చేయవలసిన [illegible]ధిపతులు వచ్చినప్పుడే యీ మర్యాద వసాయ మడంచి జి.యస్ బి. సరస్వతినోరుమూయింపకున్న నీకనెవ్వ రిపనికిఁ బాల్పడుదురని జనులు కోలాహలము చేయుచున్నారు కాని కొంచె మోర్పు చేసికొనిన నన్నియుఁ జక్కఁబడును. బాపట్లలో సభలు జరిపి బహుశః యీ యుద్రేకమును శ్రీవారు కొంత తగ్గింపఁగలరు.

## బ్రాహ్మణేతరసోదరుల కొక సలహా.

బ్రాహ్మణేతరసోదరులారా!

హిందూమతానుసారముసృష్ట్యాదినుండియుజనము బ్రాహ్మణక్షత్రి యవైశ్యశూద్రులని నాలుగు తెగలుగా విభజింపఁబడి, వారలకుఁ గర్మా చరణకాలమున శర్మ వర్మ గుప్త దాస శబ్దములు వాడఁబడుచుండుట యెల్లరకు విశదమే. అందు శర్మశబ్దము సుఖవాచకముగాన బ్రాహ్మ ణులు సర్వజనులకు సుఖముగోరి కర్మముల నాచరించుచు సద్బోధ చేయుచుండుటయు, వర్మశబ్దము కవచవాచకముగాన క్షత్రియులు కవ చము శరీరమును రక్షించునట్లు సర్వజనులను రక్షించుచుండుటయు, గుప్తశబ్దము రక్షితవాచకముగాన వైశ్యులు కోట్లకుఁ బడగలెత్తి నవ కోటినారాయణాదినామములచే విఖ్యాతులై సర్వవస్తువులను సేకరించి సర్వజనులకును విక్రయమొనరించుచు ధనమును గుప్తముగానుంచుచుం డుటయు, దాసశబ్దము దర్శనవాచకముగాన శూద్రులు కష్టజీవులయి కృష్యాది కర్మము లొనరించి సర్వజనులకు ధాన్యాదిలాభమొసంగుచు నందఱిని సుఖింపఁజేయఁజూచుచుండుటయు లోకవిదితమే; కనుకనే

'శా॥ దేశాధీశులు దేశపాలకులు తద్దేశోపకారక్రియా

వేశుల్ శిల్పులు వర్తకుల్ పెరజనుల్ శేన్యాంకగాఁగల్గు నా

కోశాధ్యక్షుండు కాఁపువాఁడుకద! సంక్షోభంబుపుట్టింపకే
దేశంబంతయుఁ గూడు వెట్టి ప్రజకుం దిన్పించుచున్నాఁ డొగిన్॥

అని యొకకవి వచించియుండెను. అట్టిశూద్రులలోఁ గమ్మ రెడ్డి వెలమ కాఁపు(తెలగ) బలిజె యని వాడఁబడుచుండెడి నాలుగు ప్రధాన సంఘములుండి రానురాను గలియుగములో సూర్యచంద్రవంశ క్షత్రియులంతరించినతరిని పై నాలుగుతెగలలోని ప్రముఖులును రాజ్యములు సంపాదించి ప్రజల న్యాయసమ్మతముగఁ బాలించియుఁ దమరువ్రాసిన గ్రంథరాజములయందును స్వీయచరిత్రలయందును సప్తసంతానములం గాంచుచు నందులో నొకటియగు కృతులందుచు వానియందును దాము చతుర్థకులసంజాతులయినట్లు వ్రాసి వ్రాయించుకొని యుండిరి.

అట్టిప్రభువులలో వెలమతెగకుఁజేరిన శ్రీ వెంకటగిరిసంస్థాన ప్రధానప్రభువగు సింగమనీఁడు సర్వవిద్వజ్జనపరిచితుఁడు. ఆయన జ్ఞాన నీతిధర్మబోధకములైన యనేకసద్గ్రంథములు వ్రాసి వ్రాయించిన ప్రభువు. ఆయనపాండిత్యగరిమ గాఁగలేక శ్రీనాథునివంటి రెడ్లరాజ్యాస్థాన కవి "ఎటులమెప్పించెదో నన్ను నింకమీఁద, రావుసింగమహీపాలు ధీవిశాలు, నిందుకొలువున" నని తనపాండిత్యము సర్వజ్ఞుని పాండిత్యమునకు లొంగుననుభయమున శారదను బ్రార్థించెను. అట్టిసర్వజ్ఞసింగమనీఁడు బ్రాహ్మణు లపకారముచేసినారలని వ్రాసికాని వారల నిందించికాని యెఱుంగఁడు. నూజవీడు బొబ్బిలి పిఠాపురాదుల నేలిన వెలమ ప్రభువులును బ్రాహ్మణనిందఁ జేసియుండరు. ఇఁకఁ గమ్మవారిలో శ్రీముద్వాసిరెడ్డి వెంకటాద్రినాయనికన్నవిద్వత్ప్రభువయ్యఁడు లోకమునఁ గలఁడని వేలుమడఁచి చూపఁజాలము. శ్రీవారును ననేకగ్రంథములను వ్రాసి వ్రాయించినట్లు తద్వంశీయులైన వాసిరెడ్డి వెంకటసుబ్బాదాసుగారు తమ వాసిరెడ్డివంశచరిత్రలో నుదాహరించియుండిరి. అంకినీఁడుబిరుదాంకితులగు యార్లగడ్డవారుగాని వాసిరెడ్డివారుగాని కపిలేశ్వరపురాది

ప్రభువులుగాని బ్రాహ్మణు లపకారము చేసినారని వ్రాసి నిందించియుండరు. ఇఁక రెడ్లవంశములోఁ గొండవీడు కొండపల్లి చిక్కవ్రోలు మున్నగు కొండదుర్గములను బాలించిన యనవేమ కాటయవేమాది ప్రభువులు ను విద్యావంతులయి యనేకోద్గ్రంథములు వ్రాసి వ్రాయించినవారలు బ్రాహ్మణనిందఁ జేసియుండలేదు. ఇప్పుడును గద్వాల మునగాల మున్నగుచోట్ల జమీందారులు వారి యాస్థానములలో బ్రాహ్మణులకు వర్షాశనదానంబు లొనరించుచుండిరి. తెలగ కాఁపు బలిజె తెగలలోని జమీందారులగు బొమ్మదేవరవారు వల్లూరువారు మున్నగువారుగాని మధుర తంజావూరులు పాలించిన రఘునాథుఁడు మున్నగువిద్వత్ప్రభువులుగాని బ్రాహ్మణు లపకారము చేసినారని వ్రాసి వ్రాయించియుండలేదు. బ్రాహ్మణు లెపుడేని యితరుల కపకారము చేసినచోఁ బైనాలుగు వర్ణములం జేరిన ప్రభువులు దుష్టనిగ్రహ శిష్టపరిపాలనకొఱకు దుష్టులగు చెంచులదాయఁగట్టి నఱికించిన శ్రీమద్వాసిరెడ్డి వెంకటాద్రి నాయఁడువలె శూద్రుల నిందించిన బ్రాహ్మణులను దాయఁగట్టి నఱికింప కేలయుందురు? నఱికింప విచారించు దిక్కెవ్వరు?

వెంకటాద్రిప్రభువు తులాపురుషదాన గోగర్భప్రవేశాదులే కాక కాశి మున్నగు మహాస్థలములలోఁ జేసిన బ్రాహ్మణపూజ లొకసారి స్మరింపుఁడు. మేనం బులక లిప్పుడుం బొడమెడు. ఇప్పటికి ననేక దేవబ్రాహ్మణాగ్రహారము లాయాప్రభువుల యశస్సును జాటుచున్నవి. అట్టి పైనాలుగుతెగలప్రభువులు నిప్పటివారి సంతతివారి యంత విద్యావంతులు కారనియా మీయాశయము? దైవము గలఁడనియుఁ బుణ్యపాపములకు విచారణయున్నదనియు నొక్కసారి యాస్తికబుద్ధితోఁ స్మరింపుఁడు. ప్రపంచమునఁ బంచలోహములలో బంగారు వెండులవలె జాతులలో బ్రాహ్మణక్షత్రియులు పేరెన్నికగనిరి. కావుననే కమసాలులు విశ్వబ్రాహ్మణులమనియు దేవాంగులు దేవబ్రాహ్మణులమనియుఁ బల్లెలగ్నికులక్షత్రియులమనియు గవుండ్లకులస్థులు

గౌడక్షత్రియులమనియు నింకను నెందఱో యీబ్రాహ్మణ్య క్షత్రియత్వములకై పెనఁగులాడుచు నేతచ్చిహ్నములగు జన్నిదముల ధరించి వేదోక్తకర్మము లాచరించుచుంటిమని ప్రగల్భము లాడుచున్నారు; కాని యట్టి వేదోక్తకర్మముల ననాదినుండి శాస్త్రోక్తరీతి నాచరించెడి బ్రాహ్మణక్షత్రియు లాచరింపక బ్రాహ్మణక్షత్రియబ్రువులై తిరుగుచుండ, నఱువది యేండ్ల కాహితాగ్నులగువారి మాహాత్మ్య మెట్టుండునో లోకవిదితము. జన్నిదములు లేకున్నను మర్యాదలు పొందఁదగినవారలు పొందుచునే యున్నారు. కోరినవారికి బ్రాహ్మణ్య మిచ్చుచునే యున్నారు. రామమోహనరాయలును కేశవచంద్ర సేనేశ్వరచంద్ర విద్యాసాగరులును దెలుఁగువారిలోఁ గందుకూరి వీరేశలింగాములును బ్రిథానమార్గదర్శకులై సంఘసంస్కరణాములకు దారితీసియున్నారు. వీరందఱును బ్రాహ్మణులే. వీరందఱిలో నగ్రస్థానమలంకరించినది దయానందసరస్వతి. 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః' అను గీతావాక్యమునకు స్వకపోలకల్పితార్థమునార్యమతబోధనియున్న గ్రంథములయందు వ్రాసి సర్వజాతిసమ్మేళనమునకై పాటుపడిన యీమనయు బ్రాహ్మణుఁడే. ఈయనగ్రంథముల నాధారముచేసికొని పూర్వపు బ్రాహ్మణులచే సత్కార్యాచరణకాలమునందు దాసులనివాడఁబడు కమ్మవెలమ మున్నగు నుత్తమశూద్రులకు దాస యన లంజకొడుకని యర్థము చెప్పి బ్రాహ్మణేతరోద్యమమును నూఁతగాఁదగిల్చి జాడెముల వేయించుచున్న జి. యస్. బి సరస్వతియను మహానుభావుఁడును బ్రాహ్మణుఁడే.

ఈయన దాసశబ్దమున కిట్లర్థముగల్పించి మున్ముం దీగొప్పతెగలకు బోధించి యనంతరము నిమ్నజాతులవంక కేగవచ్చునని యాశించియుండ నాయుద్యమము కొనసాగించుటకు దేవదూతయా యన గాంధిమహాత్ముఁడు స్వరాజ్యమే పరమావధియనియు నస్పృశ్యత నశించినఁగాని స్వరాజ్యము రాదనియు బోధించి కార్యాచరణమునకుఁ గడంగెను. దీనికిఁదోడుగా రాజకీయోద్యమమునం దీషద్భేదమున్నను

**మతవిషయమున** దయానందు ననుకరించి సంస్కారణాభిమానులైన **రామమోహన** వీరేశలింగములు తీయించిన జన్నిదములు వేయించుటకు దివ్యజ్ఞానసమాజమనుపేరఁబరఁగు **నా**నిబిసెంటుపాత్రివా రొకరు బయలుదేరిరి. రాజకీయలాభములకొఱకు కయికోపాయున్నగు దేశములలో నైసీ యస్, బీసీ యస్ ప్యాసుచేసి యున్నతో**ద్యో**గములకై దారితీసినదికూడ మా బ్రాహ్మణులే. ప్రిక్ష్యుద్యమారంభమునను దారితీయువారు బ్రాహ్మణులే. ఆరంభమునఁ గొందఱు ప్రతిఘటింతురు గాక. ఫలప్రదమైనను గాకున్నను జివర కందఱు నాగక **చూ**చు**చుండ**వలసినదేకాని దైవనిర్మితమును కెవరడ్డగింపఁగలరు? పై నుదాహరించిన యుత్తమశూద్రజాతీయుల **వేద**పఠన యజ్ఞోపవీత**ధా**రణ క్షత్రిశ్రద్ధనిర్వాహణాదులకంటెఁ బూర్వమే యగ్నికులక్షత్రియులును దేవబ్రాహ్మణులును యజ్ఞోపవీతాదులు ధరించినపుడే యేమియుఁ జేయఁజాలని బ్రాహ్మణు లిపు డేమిచేయఁగలరు? జి. యస్. బి. సరస్వతిగారి బోధలువిని **సా**మాన్యశూద్రులే కాక **మొ**న్న **మొ**న్నటివఱకు శ్రీమత్తిరుపతి వెంకటేశ్వరకవి శిష్యుఁడనని బ్రాహ్మణద్వయకక్షలో వెంకటేశ్వరబ్రాహ్మణకక్షకుఁ జేరి వాదించిన శ్రీమత్త్రిపురనేని రామస్వామి చౌదరిగారు గాంధియుద్యమములో భేదించినటులఁ దమ రైతుపత్రికలో బ్రాహ్మణనిందారంభముచేయుట మిక్కిలి యాశ్చర్యము. అయినను వీరినిందకు బ్రాహ్మణేతరులేయగు చిన్నప్వారు రామిరెడ్డిగా రాంధ్రపత్రిక 12-9-22 మంగళవారమునను గోమట్ల గంగిరెడ్డిగారు 2-9-22 శనివారము నాంధ్రపత్రికలోను నిష్పక్షపాతముగా సదుత్తర మిచ్చియున్నారు. 'సంఘేశక్తిః కలౌయుగే' యన్నట్లు సంఘాధిక్యముగలవారెచటనున్నను నేమన్నను వారివాదము చెల్లును గాన వృథాబ్రాహ్మణనింద వలదనియు నిందువలన నిప్పటి యతివాది మితవాదిప్రముఖులందఱి**చే**తను వాంఛితంబైన స్వరాజ్యపు టాందోళన కిదివేరుపురుగై యైకమత్యమును నశింపఁజేయుననియు నా బ్రాహ్మణేతరసోదరులను హెచ్చరించుచున్న వాఁడను. 'శ్లో॥ కృతేతు మానవా ధర్మా స్త్రే

తాయాం గౌతమాః స్మృతాః ద్వాపరే శంఖలిఖితాః కలౌ పారాశరాః స్మృతాః' అను స్మృత్యుక్తిప్రకారమే యీయుగము నడచుచున్నది. నడువఁగలదు.

క॥ శ్రుతిధర్మంబులు శూద్రులు ప్రీతిభం జెప్పంగ వినుచు బ్రాహ్మణజనముల్
మతిచెడి వర్తించుచుఁ దా మతినిందితకర్మకారు లయ్యెద రధిపా!

అను భారతోక్తి వ్యర్థముకాదు. కలిప్రేరణచే భ్రష్టవేదకర్ములయి "యుగరూపాహి తేద్విజాః" అనునట్లు పొట్టకూటికై ప్రైవేటు వకీలు మొదలు బ్యారిష్టరువఱకుఁ బ్రత్యుద్యమమునను దారితీసి యాదారియం దితరులు ప్రవేశించిన కొలఁది నింకొకతెన్నుకై పన్నుగడఁబన్నుచుఁ బూర్వము జమీందారులొసంగిన మాన్యక్షేత్రాదు లన్యాక్రాంతముచేసి కొందఱును రాజకీయవిద్యనభ్యసించి రాజకీయోద్యోగము లొనరించుచుండ బ్రాహ్మణేతరసోదరు లందులోఁ బోటీగానిల్చినప్పుడు బ్రాహ్మణున కాపద్ధర్మమైన కృషికర్మములోఁ బ్రవేశించుదమన్నఁ దామి దివఱకుఁ జదివిన విద్యకై యమ్మిన భూము లన్యాక్రాంతములగుటచే రెంటికిం జెడిన రేవణులయిన బ్రాహ్మణుల వేదాచారానుష్ఠానముల నితరులకుఁ బోటీయు వేదని నిందించిన లాభమేమి? పారంపర్యపుహాక్కని పీకులాడుచుండిన బ్రాహ్మణులు శ్రుత్యుక్తభిన్నాచారులయి బ్రాహ్మణబ్రువులయి యేమిపాముకొనుచుండిరి? మనశ్శుద్ధివిషయమైన వేదపారాయణాదులవలన మీకుమాత్రము మనోనియమము లేనిచో నేమిచేకూరఁగలదో యోజింపుఁడు.

ఇట్లు
మండ చినవెంకయ్య,
దండమూడి, బాపట్లతాలూకా.

—• శ్రీకల్యాణానంద భారతీస్వాములవారికి •—

గుంటూరు మండలములోని బాపట్లతాలూకా చెరుకూరుగ్రామ సభవారు తెలియఁజేయు విజ్ఞాపనము.

మీరు గుంటూరునుంచి ప్రచురింపించి మాగ్రామసభ వారికిఁ

బంపిన కరపత్రము మేము చూడఁగలిగినాము. మీకరపత్రములో నాంధ్రదేశమునకంతకు మీరు గురువులైనట్లును మి మ్మారాధింపవలసినట్లును జాతుర్వర్ణ్యశిష్యగణమును మీ వద్ద మతాచారవ్యవహారములు పరిష్కరించుకొనవలసినట్లును దెలుపఁబడినది మీరు ప్రకటించుటలోఁ జాలఁ బొరపడితిరని మేము మనవిచేయుచున్నాము. మా దేశమున కెప్పుడును విరూపాక్షపీఠాధిపతులు గురువులు కారు. మే మెన్నఁడును విరూపాక్షపీఠాధిపతిని బూజింపవలెనని కాని వారు మారాష్ట్రమునకు గురువులని కాని తెలఁచియుండలేదు. వృద్ధులైనను జెప్పియుండలేదు. సుమారు 60 సంవత్సరములకిందట శ్రీశ్రీ జగద్గురు పుష్పగిరిపీఠాధిపతులే మాగ్రామములకు వేంచేసి భిక్షకులు పాదపూజలు స్వీకరించి మ మ్మనుగ్రహించినట్లు కొన్ని పత్రికలవల్లను మాపెద్దలవల్లను దెలిసికొంటిమి కాని మీ పేరు వినియెఱుంగము. అభినవవిరూపాక్షపీఠ మొకటి గోదావరీమండలములోఁ గలదనియు విస్పష్టముగాఁ దెలుపుచున్నారు. అట్టిచో మీ కధికారమున్నట్లు ప్రకటించుట యసంబద్ధము. హిందూమతసాంప్రదాయములో నెట్టిసంబంధమును లేని మీ రెవరో మాకుఁ దెలియకున్నప్పటికి మీరు శాసించుట విచిత్రము. మీకరపత్రములో మాపీఠమునకు లోఁబడిన పుష్పగిరిపీఠము మొదలగు సంగతులు ప్రకటించినారు. యిది కేవల మసమంజసముగానున్నది. ఎందువల్లననఁగా, ప్రతివిషయమునందునను బైవారియొక్క యధికారమనుయాయులకుండదు. మీకంటె శ్రీ పుష్పగిరిపీఠాధిపతు లుచ్చస్థితిలో నున్నారని మీ రొప్పుకొందురా లేదా?

మీ కేమాత్ర మాదాయమురాఁగల వసతులున్నవి? మీ రెన్నిపర్యాయములు మాప్రాంతములకు సంచారమువచ్చినారు? ఏ యేగ్రామములలోఁ బూజాపురస్కారములు జరిగినవి? మాప్రాంతములలోని పూర్వికు లెవరైనను మీరే గురువర్యులని సిద్ధాంతీకరించిరా? కొంతవిషయము పరిశీలింపఁగా మీపీఠము నిశ్చయమైనది కానట్లును గల్పితమనియును దెలుచున్నది. స్వామీ! సన్యాసులును విరాగులును నగు మీరు

కూడ సరాగులగుట యాశ్చర్యము గలుగఁజేయుచున్నది. మీరు యతీంద్రులగనుక గ్రామాదులలో సంచారముచేసినచో భక్తిగలవారు భిక్షచేయుదురు. మీకుఁ గావలసిన దంతియేకదా! కాని మీరు జగద్గురువులని యంగీకరింపమని ఖండితముగా మనవిచేయుచున్నాము. ఆపేరుతో మిమ్ము నాహ్వానింపఁజాలము. మఱియొక మనవి. మీది విరూపాక్షపీఠమని మీరు వ్రాయుచున్నారుకదా! విరూపాక్షపీఠము ప్రస్తుతము హైదరాబాదుప్రాంతములో సంచారము చేయుచున్నదే. వారెవరో సెలవిత్తురా? మీరు లేనిపోనిశ్రమ కలుగఁజేసికొనుచున్నారు. అవసరమగునెడల మీది వాస్తవమగు పీఠముకాదని ధ్రువపఱుపఁగలము. ఇంతే యనేకవందనములు.

రుధిరోద్గారి సం॥ మాఘ శు ౨ బుధవారము. } ఇట్లు, చెరుకూరు గ్రామసభాసదులు.

ఈ క్రింద నోరి సేతురామయ్యమున్నగు ౧౬ మంది బ్రాహ్మణుల దస్తతులు కలవు. ఇందులోని భావమాత్రము శుద్ధముగా మార్పఁబడియున్నదికాని విషయ మించుకంతయు మార్పఁబడియుండదు. ఇట్లే నర్సారావుపేటనుండి శంకరమంచి లక్ష్మీనారాయణశాస్త్రి మేళ్ళచెర్వు ఆంజనేయులు (సభాపతి) మున్నగువారు నూఱుమంది దస్తతులుచేసి యొక పత్రిక పంపిరి. మంగళగిరి లక్ష్మీనరసింహస్వామి కల్యాణోత్సవ సందర్భమున సుమారు ౨౦౦ మంది దస్తతులుచేసి పంపియుండిరి. పుష్పగిరి పీఠాధిపతులు దేశజనుల కందఱకు "మీకు సదాచారవ్యవస్థాపనవిషయమై గురువులము మేముకాని యితరులు కా"రని ప్రకటించుచున్నవారు.

సత్తెనపల్లి తాలూకా గోరంట్లాగ్రహారికులు సుమారు ౩౦ మంది చేవ్రాళ్ళుచేసి యొక ప్రత్యుత్తరము పంపిరి. బాపట్లతాలూకా మట్టుపూడి వర్ణత్రితయజనులును ౭౦ మంది యొకలేఖనంపిరి. బాపట్ల నివాసులగు కర్లపాలెపు సూర్యనారాయణశాస్త్రిగారు స్మార్తగురుపీఠాందోళన దర్పణమనుపేర స్మార్తగురుపీఠములయందుఁ గలిగిన ప్ర

స్తుతాందోళనములను గుఱించి యొక పుస్తకమే ప్రకటించియున్నవారు. ఇట్లూరూరినుండి క్రమముగా లేఖలను బంపి గుంటూరు పురంబున నపూర్వపీఠంబునకు బోధానంద భారతీస్వాములవారిచే రిజిష్టరాఫీసులోఁ బట్టాభిషిక్తులుగాఁ జేయఁబడి రికార్డుకట్టయే పీఠద్రవ్యముగాఁ బెట్టుకొని యున్న కల్యాణానంద భారతీ స్వాములవారికిఁ దక్కనయున్న రికార్డు పూర్తి చేయఁగలరు. అదియేకదా వీరిపీఠమునకున్న వైభవము. గజములా, అశ్వములా, ఆందోళికములా!, పరివారమా? ఇందుపై యతులమగు మాకీ వైభవమేలయని వారో వారిశిష్యులో యాక్షేపింపకపోరు. కాని యతులకు రిజిష్టరాఫీసులు సామ్రాజ్యపట్టాభిషేకములు నేలొకో తెలియరాకయున్నది. శృంగగిర్యాది పీఠములయం దొకరితర్వాత నొక రధ్యక్షులై దేశసంచారములు చేయుచు ధర్మవ్యవస్థకై పాటుపడుచుండుట చూచుచున్నారము కాని యీసామ్రాజ్యపట్టాభిషేకములు నీరిజిష్టరుచేయుటలు నెన్నఁడును జూచియుండము. ఇది యపూర్వపద్ధతి. ఆపీఠములన్నియు నిట్టి కాగితపుఁగట్టలు శ్రీచక్రముమాత్రమే కలవి కావు. లక్షలయాదాయము వచ్చునవి. లక్షల యైశ్వర్యముగలవి. ఈ క్రమమంతయు హాస్యాస్పదమగుట యెఱుంగక కల్యాణానంద భారతీ స్వాములవారు వ్యర్థమైన యార్భాటమునకుఁ గడంగిరి. వీరినడవడియంతయు హాస్యాస్పదముగనే కనుపట్టెడిని. రానురాను మఱింత మితిమీఱెడిని. ప్రప్రథమము వరంగలులో నాల్లాది రామకృష్ణవిద్వచ్ఛయనులుగారితోఁ బ్రతిఘటించి తదాది యేకపక్షవాదములోఁ బరాభూతులగువఱకు హాస్యాస్పదములగు నిట్టిచర్యలే పెక్కు లాచరించినను నీనడుమఁ జిత్తము కొంత శాంతమవలంబించినటులఁ గానవచ్చెను.

ఇప్పటి రెండవ శ్రీముఖమునుంబోలె నప్పుడు రామకృష్ణవిద్వచ్ఛయనులవారు వ్రాసిన భ్రమభంజని ఖండించుచుఁ బ్రకటించిన యహంకారధ్వంసినియుఁ గడుఁ దీవ్రముగనుండి చయనులవారి నత్యంతము దూషించి దూషణపాత్రంబైనయది. వరంగలుపురమున శ్రీ చయనుల వారికి బహిష్కారపత్రికఁబంపి బహిష్కృతులైరి. అహంకారధ్వంసినీ

నిజస్వరూపమును వ్యక్తీకరించితివన్న కోపముతో నాకును నాయభిప్రాయమున నేకీభవించిన జంధ్యాల గౌరీనాథశాస్త్రిగారికిని బహిష్కారపత్రికపంపి పరిహాసపాత్రులైరి. అట్టిపత్రిక నాంధ్రపత్రికలోఁ బ్రచురింపఁబంపి యుపహసింపఁబడిరి. ఏకపక్షు ద్విపక్షువాదసభకు వచ్చుచు నాహ్వానసంఘమువారు తగుమర్యాద చేయలేదని ప్రాయశ్చిత్తదక్షిణ గోరి పరిహాసపాత్రులైరి. ఇవియన్నియు జరిగినపైఁ గొంతకాలమునుండి మిన్నకున్నకతంబున మార్గమునకు వచ్చిరని యనుకొంటిమి. కాని బోధానందభారతీస్వాములవారు వచ్చి మరలఁ జెడఁగొట్టిరి. వారు పీఠసామ్రాజ్యమునకుఁగాదు వీరి నభిషిక్తులఁజేసినది. చండకౌశికస్థానమునకు వారియాలోచనవిని నాఁడు పుష్పవతియై గర్భాధానమున కువ్విళ్లూరుచున్న పాణిగృహీతిని బరితాపానలమునం బడవైచి పీఠాధ్యక్షత గాంక్షించి పరివ్రాజకులైరి. "భక్షితేపి లశునే వ్యాధి ర్ననివృత్తిః" అన్నట్లు పితౄణముక్తికారకంబగు నత్యాసన్న ధర్మపత్నీసంగమునకు ననభిముఖులైనను బోధానందభారతులవారు కొంచె మారోగ్యము తనశరీరమునకుఁ గలిగినంతనే యాపీఠాధ్యక్షత నీయకపోయిరి. ఆకాకితములకట్టయు నా శ్రీచక్రమును నప్పుడే యిచ్చిన నాఁటినుండియే పాటుపడుచుండిరి కదా! అట్లొసంగక యెప్పుడు బలాత్కారముగ హరించునోయను భయమునఁ నీపీఠాధ్యక్షత యెన్నటికిని గోరువాఁడఁగానని కరారు నామాగూడ వ్రాయించుకొనిరి. ఇట్లు బోధానందభారతీస్వాములు వీరిని జండకౌశికస్థానముననే యభిషిక్తులఁ జేయనిచోఁ బరంపరాగతమైనను గాకున్ననుగాకరపర్తి పీఠమునకుఁ జేరినయాదేశముననే పోయి పెనఁగులాడక శృంగగిర్యాదిపీఠములన్నియుఁ దనక్రిందివనియుఁ బుష్పగిరిపీఠాధిపతిని దత్స్థానమునుండి దించివేసి తనశిష్యు నొకని నెక్కింతుననియుఁ దానును దన గురువును దన శిష్యులిరువురును దప్ప భారతీసాంప్రదాయు లింక నెవ్వరును లేరనియు నిట్లు మితిమీరిన ప్రసంగముతో రెండవ శ్రీముఖము నంతయు నింపియుండరు. వేయేల ఈ రెండవశ్రీముఖమును